## వేసంగి పాఠశాల ఆపి వేయబడినది

(స్వకీయ విలేఖరి)

కొలనుపాక తీరు ౯

ఇచట స్థానిక వేసంగి గ్రామజన పాఠశాల ప్రారంభదివసమునిలోగా ప్రకటింపబడుటచే పరిసర గ్రామములను డి సుమారు ౧౫గురు విద్యార్థులు వచ్చియుండిరి. సాయంత్రము వ్యవస్థాపకులును విద్యార్థులగువారికి దిగువ ప్రకటన గావించబడెను.

ఇప్పుడే శ్రీమందుముల నరసింగరావుగారి తే ఖ అందినది. అందు కొలనుపాకలో ఈసమయమున వేసంగి పాఠశాల స్థాపించు టుచితము కాదు? అని మ. ఘ. వ. నిజాం ప్రభుత్వ హోం సెక్రెటరీ గారి ఉత్తరువు తమకు అందినదనీ ప్రస్తుతము పాఠశాలను ఆపుకొనుట ఉచితమనీ ఆదేశించిరి అందుచే పాఠశాల తాత్కాలికముగా ఆపబడినదని విచారపూర్వకముగా ప్రకటించుచున్నాము అవసరమేర్పడిన త్వరలోనే వివరమును ప్రకటన గావించబడును

పాఠశాల వ్యవస్థయెడ మీరందరు చూపిన ఆదరాభిమానములకు కృతజ్ఞత తెలుపుకొనుచున్నాము

ఈ ప్రకటన విద్యార్థులకు అధిక నిరాశ కలిగించినది. వారందరు వెంటనే తమ నివాసస్థలములకు వెడలిరి.

## తాలూకాసభా యత్నము

(ప్ర. వి.)

సిద్ధిపేట, తీరు ౧౦

౧౬—౪—౪౦ ఆదివారమునాడు శ్రీయుతులు బచ్చు వేంకటేశ్వరగుప్త గారును జె రామరెడ్డిగారును ళంకరంపేట నివాసులగు శర్మగారును వి వ్యక్తి ప్రముఖులతో కలసి ఆంధ్రమహాసభ ప్రాముఖ్యతను గురించి బోధించిరి.

మరునాడు సాయంకాలము శరత్ శ్వరాలయమువద్ద సభను గావించి యిచట తాలూకా సంఘము నుండుట ఆవశ్యకమనియు సామాన్యముగా వారు ఆలోచించియున్న ఉన్నామహేశ్వర ఆంధ్ర భాషాభివృద్ధి కై పనిచేయుటకు ఉద్యమించవలెనని వారు సభను ఉద్దేశించి పరస్పరతను అయమని బోధించిరి.

౧౯౪౦ తది తేదీలలో నొక తేదీ నిర్ణయించి మెంబర్లను చేర్చి తాలూకా సంఘసభను గావింపనిశ్చయించిరి ఈసభకు గాను గవర్నమెంటు యొక్క అనుమతిపొందుటకు శ్రీయుత బచ్చు వేంకటేశ్వర గుప్తగారిని కోరనైనది

౧ ఇనా సూ బా దు

## ప్రకటించబడని వ్రాతలు

ఈక్రింది విషయాలనుగూర్చి మాకు చేరియున్న వ్రాతలను ప్రకటించజాలనందుకు మేము విచారపడుచున్నాము—

౧ మెదకుజిల్లాలోని ఎల్లారెడ్డి వార్తలు

౨ బాల్యవివాహ నిషేధశాసనము— బెదరింపులను మందలింపులు

౩ సూర్యాపేట తాలూకాలో అర్వపల్లి పరగణాలో నల్లగొండ డివిజన్ ఆఫీసరు జమాబంది ("౧౨౦ రైతులు" అని వ్రాసినారు కాని ఒకరైతు సంతకమైనా లేదు)

౪ విగవావివాహము శాస్త్రీయమా?

(ఈశ్వరచంద్ర విద్యాసాగరు, కందుకూరు వీరేశలింగము పంతులుగార్లు గతించిన ఇన్నిఏండ్లకు ఈ ప్రశ్న అనవసరము)

## శ్రీరామనవమి

వైశాఖ శు ౧ నాడు జరిగినది

(ప్ర వి)

జనగాము, తీరు ౭

ఇచ్చట శ్రీయుత అప్పుల స్వామి స్టేషన్ మాష్టరు) గారి శ్రద్ధతో శ్రీరామనవమి సేవతీయబడెను వీరు శ్రీరామనవమి కిముందే తహశీలులో సెలవుకొరకై అర్జీవ్రాసుకొనియుండిరి కాని అప్పుడు అనుమతి దొరకలేదు అందువల్ల అనాడుతీయవలసిన సేవ ఈనాడైనా తీయబడెను ఇందులో సుమారు (౫౦) మంది మాత్రమే పాల్గొనిరి, మరియు ఆమీన్ ఇద్దరు పోలీసులు కూడా ఉండిరి

## యాద్గిరు అల్లరి

హైదరాబాదు(దక్కన్)తీరు౧౦

పైఅల్లరి విశేషాలు తెలిసికొనుటకు గాను హైదరాబాదునుండి హిందూప్రజామండలివారు కొందరినక్కడికి పంపుచున్నారు

## డోర్నకల్లు అల్లరి

హైదరాబాదు (దక్కన్) తీరు ౧౦

డోర్నకల్లులో రైలులో అరబ్బుచేసిన దుండగాల విశేషములను పత్రికలో ప్రకటించినారు— ఆయరబ్బు పేరు అబ్దుల్ రౌఫ్ అనువాడు సర్కారు టికెట్టు తీసుకొనిపోవుచుండెనట అందుచేత డబ్బాలలో నెవ్వరినీ రానీయలేదట వాడుపెట్టుఅడ్డంకులను లక్ష్యపెట్టని ఇద్దరుపోలీసులను ఒక ప్రయాణికుని వాడు జంబియాతో పొడిచినాడట డోర్నకల్లులో రైల్వే ఉద్యోగులందరిని ప్రయాణికులనందరిని బెదిరించినాడట తుదకువాడుండే డబ్బాను విడదీసియుంచిరి వరంగల్ ఖమ్మంమెట్టునుండి పోలీసు సిబ్బందిని పిలిపించినారట వారు మరునాడు వచ్చినారట. ఆతన్ని ఏదోవిధంగా వశపరచుకొన్నరట, సికింద్రాబాదు మెజిస్ట్రేటువద్ద విచారణ జరుగుచున్నది.

## చెంచువారి పరిశోధన

హైద్రాబాదు (దక్కన్) తీరు ౧౦

యూరపుఖండములోని వియన్నాలోనుండి ఫాన్ హైమాండ్రాఫ్ అను యువకుడు కాలేజీ విద్య పూర్తిచేసుకొని మనరాష్ట్రములోని అమ్రాబాదులోని చెంచువులనుగురించి పరిశోధన చేయుటకు వచ్చినాడు (ఈచెంచులు తెనుగువారి భాషను స్వీకరించిరి మనరాష్ట్రములో నున్నారు కాని మన తెనుగువారెవ్వరూ శ్రద్ధవహింపక పోయిరి

## అనంతగిరి క్షయాలయము

హైదరాబాదు (దక్కన్),తీరు౧౦

ఇది యింతలోనే శీఘ్రముగా యారంభమై పూర్తి చేయవలెనని ప్రభుత్వమువారు సంకల్పించినారు. అందుచేత అచ్చటిబంగ్లాలు కట్టుటకు భాగాలుచేసి చాలామంది కాంట్రాక్టర్లకు గుత్తాకియ్యనున్నారట

## సర్ కిషన్ ప్రసాదుగారిని గురించి ఓ. ఘ. వ. నిజాంగారి ఫర్మాను

"మహారాజా సర్ కిషన్ ప్రసాదుగారి మరణము చాల విచారము కలిగించినది వారు గొప్ప అమీర్లలో చేరినందునను వారు చాలకాలము విశ్వాసయుక్తముగా ఉద్యోగము చేసినందున వారి జ్ఞాపకార్థము ౧౬ మే గురువారము రాత్రివరకుటను సెలవు ఇయ్యబడుచున్నది

(ఇది ఆయిపోయినది)

ప్రతివాడు ఈప్రపంచాన్ని ఎన్నడో ఒకనాడు వదలిపోవలసినదే కాని గౌరవముగా బ్రతికి తాముచేసిన ఘనకార్యములను గుర్తుగావదలి సద్గుణాలతో కూడినవారే ధన్యులు, అట్టివారిని ఎంత శ్లాఘించినను తక్కువే"

## మహారాష్ట్రి మహాసభ

హైద్రాబాదు(దక్కన్)తీరు౧౦

తుదకు మైమహాసభ కాశీనాధరావు అధ్యక్షతలో నాందేడుజిల్లాలోని ఉద్గీర్లో జూనైలో చేయుటకు మహారాష్ట్ర అంగీకరించినారు

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర వైశాఖ శు॥ ౧౪
సోమవారము


## ఖాక్సార్లు

ఒక సంవత్సరమునుండి ఖాక్సార్ల గడబిడలు శ్రుతిమించి వికార పరిణామముతో ఈనాడు పంజాబులో కనిపించుచున్నవి. ఈఖాక్సార్లు ఎవరు? వీరిసంస్థ ను ఎవరుస్థాపించిరి? వీరి ఉద్దేశములేవి! వీరి నియమాలేవి? వీరివ్యాప్తి యెక్కడెక్కడ? ఇట్టి ప్రశ్నాపరంపరలు చాలమందిలో ఉత్పత్తియైనవి.

బ్రిటిషిండియాలోని మన ఆంధ్రపత్రికలకు ఖాక్సారు అను ఫార్సీపదము సరిగా తెలియక ఇంగ్లీషులోని లోపభూయిష్టమగు ఉచ్చారణనుబట్టి వారు ఈకొత్త తెగను ఖక్సరు, కక్సరు, కక్సారు, ఖక్సారు, ఖుస్కరు, ఖుస్కారు, కస్కరు, కస్కారు, అని యెన్నియో వికారరూపాలలో నుచ్చరించవలెనో అన్నివిధాల నుచ్చరించుచు వ్రాయుచున్నారు. కాని సరియగు రూపముమాత్రము అరుదుగా వాడియుచున్నారు. ఖాక్సారు అనగా మట్టితో సమానుడు అనియర్థము. అనగా దీనుడు, దరిద్రుడు, విధేయుడు,అను పర్యాయార్థాలిచ్చును.

ఈ ఖాక్సారు ఉద్యమాన్ని అల్లామా ఇనాయతుల్లా మష్రఖీ అనువారు స్థాపించిరి. వీరు గొప్ప విద్యావంతులు. ఇంగ్లాండులో విద్యనభ్యసించి బ్రిటిషిండియాలో విద్యాశాఖలో విద్యాధికారి పదవిలో పనిచేసినట్టివారు. అంతగొప్ప పదవియున్నను దానిని వారుత్యాగము చేసిరి. వారు భారతదేశములో ముస్లిములలో గొప్ప మిలిటరీశక్తి నుత్పత్తిచేయవలెనను సంకల్పముతో ఈ ఖాక్సారు ఉద్యమాన్ని లేవదీసిరి. దీనికి ఆదర్శము నాజీ మిలిటరీపద్ధతి. హిట్లరుయొక్క నాజీలు అధికారానికి రాకపూర్వము ప్రైవేటు సైన్యముగా ఏర్పడియుండిరి. సమయమువచ్చిననాడు తమ కఱ్ఱలను పారవేసి తుపాకులనుబట్టి జర్మనుప్రభుత్వాన్ని వశపరచుకొనిరి. అదేవిధముగా ఈ అల్లామా ఇనాయతుల్లా మష్రఖీగారు ఖాక్సారులకు ఖాకీ యూనిఫారమును తొడిగించినారు. చేతులతో పారలుపట్టించినారు. రైట్ లెఫ్ట్ అని వారిచే డ్రిల్లు చేయించి... దళవాయి,ప్రధాన... ముందు...

ముగా కొరడాదెబ్బలుకొట్టుట, లేక మరికొలువ లూడ్చించుట, మున్నగుశిక్షల నిత్తురు. వహీదుద్దీన్ హైదర్ అనునతడు సామాన్యవ్యక్తి కాడు. అతడు ఖాక్సార్ల "జనరల్ ఆఫీసర్ కమాండింగ్" హోదాపై నున్నవారు.

ఒకజిల్లా మెజిస్ట్రేటు గతసంవత్సరముపై హైదర్ పై ౧౪౪ సెక్షనుక్రింద ఆజ్ఞయిచ్చెను. దానికతడు బద్ధుడయ్యెను "ఏక్టుతివి" అని అతనితప్పిదానికి బజారులో నిలబెట్టి కొరడాకొట్టుటకై అల్లామాగారాజ్ఞాపించిరి. అట్టిశిక్షను హైదరు సంతోషముతో భరించెను.

లక్నోకు గతసంవత్సరము ఒక (అమీరెఖాను) ఖాక్సార్ ఉద్యోగి వేంచేయు సందర్భములో వారి గౌరవార్థము ౧౦౧ తోపుల సలామీ ఇయ్యవలెనని వహీదుద్దీన్ అనునాతని కాజ్ఞయియ్యబడెను. అయితే తోపులు, తుపాకులు, వీరివద్ద యెక్కడివి. అందుచేత దీపావళిలో కాల్చునటువంటి పటాకులు ౧౦౧ కొట్టి ధ్వనిచేయండి, అని ఆజ్ఞయయ్యెను. ఈపిల్లాటలు మానుకొనవలెనని జిల్లాఅధికారివారి కాజ్ఞయిచ్చెను వహీదుద్దీన్ పటాకాలు కాల్చకపోయెను. అల్లామాగారికిది, తెలిసేవరకు తన మిలిటరీ శిక్షణకు విరుద్ధమయ్యెనేఅని అతనికిన్ని బెత్తముదెబ్బల శిక్షను విధించెను.

ఖాక్సార్లకు అహింసలో విశ్వాసము లేదు. అది పెంటిపని అనుకొందురు. వారికి కత్తిలోనే విశ్వాసము మెండు. "కత్తివాదము" (Philosophy of the sword)ను గురించి వారు బాగుగా బోధచేసినారు. ఒకతడవ అనగా 3 ఏండ్లక్రిందట అల్లామాగారు హిందువులకు ఉపదేశముచేయుచు నొక సందేశమును పత్రికలలో ప్రకటించిరి. గాంధీగారి తత్త్వము పట్టినపుంసకతత్త్వమని నిర్ణయించుచు వారిట్లు హిందువులకు సందేశమిచ్చిరి.

"మీరు పెం...

............కత్తివాదమే తప్పటి! వహ్వా!!"

పై అభిప్రాయాలను బట్టి అల్లామాగారికి గాంధీగారిపైనను వారి సిద్ధాంతముపైనను ఎంత అసహ్యమున్నదో విశదమగును. హింసావాదముపై వారికెంతటి గాఢమగు విశ్వాసమున్నదో అదియువిశదమగును.

ఈ ఖాక్సారులు ఇప్పుడు విశేషముగా అయోధ్యా పరగణాలోను, బెంగాలులోను,బీహారులోను హైదరాబాదురాష్ట్రములోను కలరు. తక్కిన ప్రాంతాలలో వీరివ్యాపకము కాలేదు. అయితే అల్లామాగారు చేసిన ఏర్పాట్లలో ఒకటిమాత్రము స్పష్టపడలేదు. ఈ ఖాక్సారు ఉద్యమములో నుండేదెవరు? అందరును ముసల్మానులేనా ఇతరులుకూడా ఉండవచ్చునా? అల్లామాగారు ఇతరులుకూడా ఉండవచ్చునన్నారు. అక్కడక్కడ ఒకటీ అర హిందువులును ఇందులోనున్నట్లు కనబడుచున్నది. కాని లోపలిఉద్దేశము కేవలము ముసల్మానులకే ఏర్పాటుచేసినట్లు అల్లామాగారు హిందువులను వెక్కిరించిన పై యుదాహృత భాగమునుండియు జిన్నాగారు మొన్ననే "యీ ఖాక్సారులలో విశేషముగా ముసల్మానులేయున్నారు"అనిచెప్పుటబట్టియు,హైద్రాబాదుఖాక్సారుల ప్రధానసేనానియు ఖాయిదేమిల్లత్ ,షేరెఇస్లాం, బిరుదావళీ విరాజమానులునగు న. బహద్దర్ యార్ జంగ్ బహద్దరుగారును మొన్నమొన్ననే "ఖాక్సార్లందరు ముస్లింలీగు యొక్క సైనికదళము" అని సెలవిచ్చిన విషయమునుండియు, ఈ ఖాక్సారు ఉద్యమము కేవలము ముసల్మానులదే అని చెప్పవచ్చును. వీరి యుద్దేశములలో నొకటి యిట్లున్నది-- "World sovereignty and the political domination of Islam" ప్రపంచ సామ్రాజ్యమును పొందుట, "ఇస్లాం మతానికి రాజకీయాధిక్యతను సంపాదించిపెట్టుట" అనునవి వారి యుద్దేశాలలో ముఖ్యమైనవి. మరియు ఈపార లెందుకండీ, కట్టెలో, తట్టలో, బుట్టలో పట్టుకొనిపోగూడదా? తట్టలు బుట్టలు మట్టిమోసుటకు బాగా పనికివచ్చునుకదా అని యెవరైన అనవచ్చునేమోఅని ముందుగానే వారే జవాబిచ్చినారు. పైగంబరు మహమ్మదుప్రవక్తగారు పారలో సేవాపరతత్త్వమున్నదని సెలవిచ్చియుండిరి. కాన మేముదానినే పసందు చేసినామన్నారు. పైరెండుకారణాలనుబట్టికూడా ఇది ముస్లిములకొరకే యేర్పడినదని విశదమగు... పాక...

మందినిమినపక్షాననున్న తుర్కీ-సహాయార్థమిత్తురు" కాని పాపము అల్లామాగారికి నేటివరకు జవాబు రాకపోగా వారే వేసుసంకల్పములో జెయిలులో శిక్ష ననుభవింపవలసివచ్చెను. ఖాక్సారులపక్షాన రెండు ఉర్దూపత్రికలు లాహోరునుండి "అల్ ఇస్లాహ్"అనునదియు కలకత్తానుండి "ఖాక్సార్" అనునదియు ప్రకటింపబడుచున్నది. గతసంవత్సరము లఖ్నోలో షియ్యా సున్నీ వివాదము జరిగెను. అల్లామాగారు తన శక్తిసామర్థ్యాలు ప్రకటించుకాలము ఆసన్నమైంది, అనుకున్నాడోయేమో ఈవివాదాన్ని-పరిష్కరించేదానికి 30000 ఖాక్సారులను పంపుతానని ప్రభుత్వానికి తంతీకొట్టినాడు. జవాబులేదు. ఇట్లుండ మరికొంతకాలానికి ౧౪ఆగస్టు౧౯౩౯నాడుఅల్ఇస్లాహ్లో అల్లామా యూ. పీ ప్రభుత్వాన్నిధ్వంసముచేయుమనని ఏమేమో ఉత్తరప్రజ్ఞలంతా కురిపించుచు మేకపోతు గంభీరముతో ఒకవ్యాసము వ్రాసెను. ౨౫ ఆగస్టునాడు అల్లామాగారే స్వయముగా లక్నోలో విజయంచేసిరి. అప్పుడుతమ ఖాక్సారులకున్ను ఇతరులకున్ను కొట్లాటలుజరిగెను. ఆసమయములోనే అల్లామాగారు ఇట్లుసెలవిచ్చిరి-- "మాకు అహింసలో విశ్వాసములేదు. అహింసావాదులు ప్రపంచములో నుండకుండ చేయవలెను" ఊరకుండే ఉత్తవాడనేగతికివచ్చింది, యూ. పీ, ప్రభుత్వస్థితి. సహనంచూపించేకొద్ది మష్రఖీ గారు విజృంభించినారు. ౧ సెప్టెంబరునాడు అటు పోలెండుపై జర్మనులుపడినారు. ఇటు మష్రఖీగారు జెయిలులోపడినారు. మష్రఖీగారు జెయిలులోని నాలుగుగోడలు చూచినతర్వాత తానే ప్రపంచములో నుండేది మనస్సుబట్టినది. నన్ను వదలిపెట్టితే యింకయిట్టి గడబిడలుచేయను అని వ్రాసియిచ్చి బయటపడినారు. గాంధి పెంటినాయకుడుకదా! మరియీ పోతుపాయకుడి కిట్టిగతి యెట్లుకలిగెను? జెయిలునుండి బయటపడి రైలులో ఎక్కిపోవుచు అక్కడను పిల్లచేష్టలు దుండగాలుచేసినాడు. లక్నోలో నిన్ను అరెస్టుచేయడానికి నీకై పోలీసులు కాచుకొనియున్నారయ్యా అని యెవ్వరోచెప్పగా వెంటనే మష్రఖీ ఆ రైలుదిగినాడు. ఇంకో రైలులోయెక్కి ఇంకోదిక్కు పోయినడు. హింసాశక్తిని బోధించిన మహానాయకునికి పిరికితనమెట్లువచ్చెనో? ఎట్లైనేమి మరొకమారు అల్లామాగారు నెం జెయిలుశిక్ష అనుభవించినాడ...

## హి. ఘ. వ. నిజాంప్రభువు గారి ఐశ్వర్యము

హోరేషు క్రెయిటన్ గారు "చికాగో న్యూస్" అను పత్రికలో హి. ఘ. వ. నిజాం ప్రభువుగారి ఐశ్వర్యమును గురించి ఇట్లు వ్రాసినారు:—

"నేను హైదరాబాదులో నుండగా నిజాం ప్రభువుగారు తమసొంతయస్టేటును, ఆస్తిని ఇన్స్పెక్టుచేయదలచినట్లు తెలిపిరి. గొప్పగొప్ప ఇన్సూరెన్సుకార్పొరేషనుల అధికారులు వారి యస్టేటు వెలకట్టుటకై రావలసినదని పిలువబడిరి. వారు శ్రద్ధతో పని ప్రారంభించిరి.

చాల వారములైనతర్వాత వారలు నిరాశతో వారి ఐశ్వర్యమునకు విలువకట్టుటయే కష్టమనిరి. ప్రభువుగారి రత్నములను మాత్రమే అమ్మకమునకుపెట్టిన ప్రపంచములోని రత్నాల వ్యాపారమంతయు క్రిందుమీదగును.

## మహారాజు కుమార్తె ఆగమనము

హైదరాబాదు తేది ౧౬

కి.శే. మహారాజా కిషన్ప్రసాదుగారి కుమార్తె, మరియు అల్లుడగు కేశవ మదనగోపాలు గారు పంజాబునుండి దయచేసిరి.

## అరబ్బు దుండగములు

మాస్వకీయ విలేఖరుడిట్లు తా-౧౭-౫-౪౦ నాడు వ్రాసినాడు.

"నేను స్వయముగా జరిగినట్లు కనుగొని మీకు తెల్పుచుండుటాయున్నాను.

౭-౫-౪౦ తేదీన శివాజీనగరమునకు ... లకు ... బయలుదేరు ... గ్రాండుట్రంకు ... దోర్నకలు చేరెను. అప్పుడు ... పూర్ణచంద్రుడు ... ఖిల్లా భాగ్యనగరమునకు తీసుకొని పోవుచుండెను. ... రైలులో ... నమయములో ... యున్న ... అప్పటికిని ఒక ... భార్యచేసియుండెను. ... బెంచిమీదా భార్యచేసి ... నిర్బంధపెట్టిరి. పూర్ణచంద్ర ... వారికి చెప్పిరి, ... దయను ... పంపిరి, ... ఆటల నిర్బంధము ... లనిరి. ... ఇద్దరి పోలీసులను ... ఈసందర్భములో ఒక ప్యాసింజరు ... గాయములయెను. ... నిండుతూ...

జరులు

రా...

గా...

# ఇష్టాగోష్ఠి

—అంగీరసుడు

### "గోలకొండ" వర్ధంతి

గోలకొండ పత్రిక పదునాలుగు సంవత్సరముల జీవితమున విచ్ఛిన్నముగ నడిపినందుకు ఆంధ్రులందరును తత్పత్రికాధిపతులకు కృతజ్ఞులై యుందురు ఏలనన హైదరాబాదు రాజ్యములో పదునాలుగు సంవత్సరములనిన పదునాలుగు మన్వంతరములనవచ్చును అపురి నిత్యమైన రాజకీయ వాతావరణమునో ప్రజ్వరిల్లుచో, ము మందగతిలోనున్న రాజ్యభాగములలో "గోలకొండ" అతి సమర్థులైన సంపాదకుల యాజమాన్యముతో దిగ్విజయముగ సాగుచుండుట ఆంధ్రులు గర్వింపదగిన విషయము హైదరాబాదులో నున్న మూడు ప్రధాన ఆంధ్రసంస్థలలోను (శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయము రెడ్డి విద్యార్థి వసతి గృహము) గోలకొండపత్రిక యొకటి "ఆంధ్రపత్రిక" ఆంధ్రరాష్ట్రములో గావించిన మహోద్బోధమునే "గోలకొండ" తెలంగానములో కలుగజేసెను శ్రీ ప్రతాపరెడ్డి వంటి సంపాదకుని ఆధ్వర్యములో "గోలకొండపత్రిక" చిరంజీవి యగుగాక?

### ఛాంబర్లేను అవతారమా?

రాజగోపాలాచార్యులుగారు చెంగల్పట్టు ప్రాంతములో ఉపన్యసించుచు నిన్ననే ప్రధాన మంత్రిత్వమునకు రాజీనామానిచ్చిన నెవిల్ ఛాంబర్లేనుగారిని అవతార పురుషునని వర్ణించెను వార్సా జర్మనీ స్వాధీనమైన తర్వాత బ్రిటిషు పార్లమెంటు చర్చలో ఛాంబర్లేనుగారి కన్సర్వేటివు పార్టీవారును, లిబరల్ పార్టీవారును లేబరుపార్టీవారును ఛాంబర్లేను ఆబిసీనియా, స్పెయిను, జెకోస్లావికియా, పోలెండుల విషయములో ఎట్లు నటనతో మ యీ నాటకమాడెనో వివరించుచు ఓడుర్చించిరి చివరకు ఛాంబర్లేనుగారు రాజీనిచ్చిరి ఛాంబర్లేను అవతారమనుటకు పార్లమెంటు సభ్యులకన్న రాజగోపాలాచారిగారికి ఏమివిశేషము తెలిసినదో గ్రహింపలేము రాజాజీకి యీమధ్య అధికారకాంక్ష మిక్కిలి కలది మద్రాసు మంత్రివర్గము నకు రాజీనిచ్చిన కొలదిరోజులకు మాట్లాడుచూ రాజాజీ "మేము మూడునెలలు సెలవు విశ్రాంతితీసుకొనుచున్నాము" అని చెప్పెను రాజాజీ ఎట్లయిననూ బ్రిటిషు వారితో సమాధానపడి తిరిగి అధికారమువహింప కుతూహలులై యున్నట్లు ఉదాహరణము లున్నవి రాజాజీ సెంటుమి (ఢిల్లీ వైస్రాయి కార్యసంఘములో) మంత్రియగుట కీఛాంబర్లేను స్తోత్రము ఉపయుక్తమని తో చియుండవచ్చును.

### సత్యమూర్తిగారి పరాజయములు

మదరాసు కార్పొరేషను మేయరు శ్రీ ఎస్ సత్యమూర్తిగారు ఆంధ్రరాష్ట్రమన్నను ఆంధ్రుల యభివృద్ధియన్ననూ చాలద్వేషించుదురు సత్యమూర్తిగారు మద్రాసు పురపాలక సంఘాధ్యక్షుడు కాగానే అంతకుపూర్వమే నియమింపబడ్డ కమీషనర్ (కార్యనిర్వాహకాధికారి) శ్రీ ఓ. పుల్లారెడ్డి ఐ సీ ఎస్ గారిని తీసివేయించి వారిస్థానే ఒక ఐరోపాదేశీయుడగు ఐ సీ ఎస్ ను నియమింపుమని గవర్నరు సలహాదార్లవద్దకు రాయబారము వెళ్లెను అహా! ఏట్టిపనిది భారతశాసనసభా కాంగ్రెసుపక్ష ఉపనాయకుడు సత్యమూర్తి తన పురపాలక సంఘమునకు అధికారకేనియమింపబడ్డ భారతీయుని (ఆంధ్రుని) తీసివేయించి ఆ స్థానే ఐరోపాదేశస్థుని కోరుట జాతీయతావిరుద్ధకార్యము ఎవరైననూ ఐరోపాదేశస్థుని తీసివేసి భారతీయుని నియమింపుమని యత్నించెదరు "పోరుచరిది ఒకయెత్తు పొట్టపెట్టుకోవ యెత్తు" అన్నట్లున్నది ఆంధ్రులపైయున్న ద్వేషమే సత్యమూర్తిగారి చేయించినది కాని పుల్లారెడ్డిగారే కమిషనరుగా ఖాయమైరి సత్యమూర్తిగారి మొదటి పరాజయమిది

మద్రాసునగర జనాభా (౧౯౩౧సం॥) పట్టికలు ఆంగ్లము తమిళము, హిందూస్థానీభాషలలో ప్రచురింపబడుటకు తీర్మానమైనది కాని రెండు న్నరలక్షలాంధ్రజనాభాకల తెలుగులో పట్టికలు యుండరాదని ఖచితముగ సత్యమూర్తిగారు ప్రభుత్వమునకు వ్రాసిరి తెలుగుపట్టికలు యుండితీరవలెనని కమీషనర్ పుల్లారెడ్డిగారు వ్రాసిరి.

ఈవిషయము తిరిగి కార్పొరేషను మీటింగులో శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారు తీర్మానము తీసికొనిరాగా ఆతీర్మానము అధ్యక్షుని భావములకు వ్యతిరేకముగ) ఏకగ్రీవముగ నంగీకరింపబడెను దానిని ప్రభుత్వమువారంగీకరించిరి సత్యమూర్తిగారికిది రెండవ అపజయము ఈసందర్భములో సత్యమూర్తిగారు ఉద్యోగములోనున్న పుల్లారెడ్డిగారికి (చిత్తూరువాసి) విశేషాంధ్రాభిమానమును బుద్ధిపూర్వకముగ కనబరచినది పూర్వపు మద్రాసు మేయరున్ను ప్రస్తుతపు భారతశాసనసభ్యులగు శ్రీస్వామి వేంకటాచలంచెట్టిగారు మద్రాసు కాంగ్రెసుసంఘాధ్యక్షులైన మదరాసు ఆంధ్రులలో అధికమైన ఆంధ్రాభిమానమును కలుగజేయుచున్నారు

### అర్థములేని ఆంధ్రరాష్ట్రోద్యమము

ఆంధ్రదేశములో నాయకత్వము లేదు అందరూ నాయకులేఅన్నట్లు ఆంధ్రరాష్ట్రోద్యమమునకు నాయకుడు లేడు- అందరూ నాయకులే ౧౯౧౩ నుండి ౧౯౨౦వరకు ఆయిదుసంవత్సరములు ఏకధాటిగా ఆంధ్రోద్యమము సాగినది తరువాత ఎప్పుడు ఉద్యమము ప్రారంభింపబడిననూ అది నెలరోజులు నేసాగుట తరువాత మందగతిని నడచుట ఆనంతరము అదృశ్యమగుట జరుగుచునేయున్నది "ఆంధ్రపత్రిక" మాత్రము సందర్భోచితముగ కాలమునను వృథాచేయుట జరుగుచున్నది అది వృథాచేయుటయేనా యని ప్రశ్నించిన వృథాయేనని సమాధానమివ్వవలసివచ్చుచున్నది ఆంధ్రరాష్ట్రముసంపాదించుటకయినపడిఏడుసంవత్సరములు ఆంధ్రులకునగవుబాటు ఆంధ్రజాతికిని ఆంధ్రనాయకత్వముకును ఆంధ్రపత్రికలకును ప్రతిష్ఠాభంగము!

ప్రత్యేకరాష్ట్రసంపాదనకంటె అతిచిన్నవిషయము సాధించుటకు దశాబ్దముల తరబడిపట్టుట- అది శతాబ్దముకునేమో తెలియదు అర్థములేని దనుని చెప్పవలెను మిగతావిషయములటుంచి రెండున్నరసంవత్సరములు మద్రాసులో కాంగ్రెసుప్రభుత్వము యుండగా జరిగినదేమి? రాజగోపాలాచార్యులుగారు ఆంధ్రావని పర్యటనము చేసి తాను ఆంధ్రరాష్ట్రము సంపాదించుటకు మొదటి బాటని వాగ్దానములను చేసెను పరోక్షముగ ఆనేకరీతుల అపకృతిచేసెను ప్రకాశంగారు మాట్లాడుచు తమకన్న రాజాజీకే ఆంధ్రరాష్ట్రమున్న ఎక్కువపట్టుదల యున్నదని నమ్మదగని మాటలు చెప్పుచూ వచ్చిరి ఒకసారి మద్రాసునగరములో ఆంధ్ర కాంగ్రెసుసంఘము యుండరాదన్నప్పుడు రాజాజీ సత్యమూర్తులుపెట్టినదానికంటె మరెవ్వరు ఆంధ్రరాష్ట్రవిషయమై ప్రకాశంగారు శ్రద్ధచూపలేదని దృష్టాంతరములనేకములున్నవి గిరిగారు అంతర్జాతీయవాదికనక రాష్ట్రాందోళనలో ప్రత్యక్షముగ కలుగజేసికొనకున్న మాటలు యున్నవి గోపాలరెడ్డిగారు కుర్రవాడేగని అతడు ఆంధ్రోద్యమములో చూపిన శ్రద్ధయు కుర్రదిగనేయుండెను వీరు ముగ్గురు ప్రత్యేకరాష్ట్రముకొరకు తీవ్రశ్రద్ధ చేయలేదనుట నిశ్చయమేకాని రాయలసీమ జిల్లాలను ఆంధ్రవిశ్వవిద్యాలయములోనికి చేర్చుటకైనా యత్నించిరో లేదు ఈచిన్నవిషయమే ఆంధ్రమంత్రులవలన రెండున్నరసంవత్సరములలోసాగనప్పుడు యింక ఆంధ్రరాష్ట్రమునుగురించి అర్థములేని ఆందోళనఎందుకు?

—







# పల్లెపాటలు

## కౌసల్యా నీతి

॥ఉయ్యాల- ఉయ్యాల ఉయ్యాలో ఉయ్యాల ఉయ్యాల- ఉయ్యాలో
శ్రీరామునితల్లి ఉయ్యాలో ॥ శ్రీమతి కౌసల్య॥ఉ॥

ప్రేమతో శాంతను ॥వు॥ పిలిచిదగ్గరదీసి ॥వు॥
చల్లనిమాటల ॥వు॥ సతిధర్మములు కొన్ని ॥వు॥
చెప్పెను ఈరీతి ॥వు॥ చెవులకువింపుగా ॥వు॥
నాతల్లి శాంతమ్మ ॥వు॥ నాముద్దులపట్టి ॥వు॥
అత్తవారింటికి ॥వు॥ ఆనందముగబొమ్మి ॥వు॥
అత్తమామలభక్తి ॥వు॥ చిత్తంబునిల్పి ॥వు॥
ధర్మదైవంబని ॥వు॥ భక్తితోపూజించు ॥వు॥
వారిసేవించిన ॥వు॥ వైకుంఠమబ్బునే ॥వు॥
వారిపైనిప్రేమ ॥వు॥ వాసుదేవునిపూజ ॥వు॥
పేదరికముజూచి ॥వు॥ ప్రీతిదప్పకుతల్లి ॥వు॥
కలిగియున్నంతలో ॥వు॥ కనిపెట్టితిరుగాలె ॥వు॥
ఇరుగుపొరుగిండ్లకు ॥వు॥ తిరుగబోవద్దమ్మ ॥వు॥
అందువల్లనీకు ॥వు॥ అపకీర్తి వచ్చునే ॥వు॥
అపకీర్తికంటెను ॥వు॥ అతివచావేమేలు ॥వు॥
పణిచక్కదనము ॥వు॥ బయటపెట్టగరాదు ॥వు॥
సాధుసత్పురుషులు ॥వు॥ సమయానికేతెంచ ॥వు॥
అన్నపానాదుల ॥వు॥ ఆదరించుముతల్లి ॥వు॥
మాటమన్ననలేక ॥వు॥ మంచిపేరలరాదు ॥వు॥
మాటజారినవెన్క ॥వు॥ మళ్ళితిరుగరాదు ॥వు॥
అందుకేముందుగా ॥వు॥ ఆలోచనుండాలె ॥వు॥
ఏదిజూచినగాని ॥వు॥ ఏదిజేసినగాని ॥వు॥
వెనుకముందరయాక ॥వు॥ వేగిరపడబోకు ॥వు॥
చేసేడుపనులందు ॥వు॥ చిత్తంబునిలుపాలె ॥వు॥
చెడిపోయినంకను ॥వు॥ చింతించిఫలమేమి ॥వు॥
పలికిబొంకగరాదు ॥వు॥ ప్రాణాలుబోయిన ॥వు॥
సత్యంబుచేతనే ॥వు॥ స్వర్గంబుకందేరు ॥వు॥
మానిమలనుజూడ ॥వు॥ మానమేప్రాణము ॥వు॥
మంచికీర్తిబ్రతుకు ॥వు॥ కొంతమైనచాలు ॥వు॥
అత్తగారింటికి ॥వు॥ అమ్మగారింటికి ॥వు॥
మంచిపేరుదెమ్మ ॥వు॥ మాతల్లిశాంతమ్మ ॥వు॥
పోయిరావేతల్లి ॥వు॥ పోయిరామాయమ్మ ॥వు॥
పోయినీఅత్తింట ॥వు॥ బుద్ధిగలిగియుండు ॥వు॥
కొడుకులుబిడ్డలు ॥వు॥ కామరూప్పుగాకల్లి ॥వు॥
నిండుముత్తైదవై ॥వు॥ యుండవేమాతల్లి ॥వు॥

(ఈపాటను సూర్యాపేట తాలూకాలోని తిరుమలగిరి గ్రామములోని యక్కల వెంకటరెడ్డి అనువారంపినారు. ఇదెవ్వరు పాడుదురు? ఎప్పుడు? ఇది ప్రాచీనమదా? గాదాఅను వివరాలు తెలుపలేదు ఇదివరలో ప్రకటించిన కలుపు పాటవంటిది గానే కనబడుచున్నది— గో. ప.)

### జాజిరిపాట

పైరెండు పాటలను, హోళిపండుగకుముందు శుక్లపక్షమున దశమి మొదలుకొని పౌర్ణమివరకు పల్లెగ్రామములందుగల యువకులు కోలలవాద్యముతో పాడుకొను ఆచారముగలదు. యిందులో జానపదములు అనేకములున్నవి

ఇట్లు
టి. రామరావు
ప్రజాహిత గ్రంథమండలి సభ్యుడు. నార్కట్‌పల్లి

జాజిరి- జాజిరి- జాజిరిపాప
జాజరాడబోతె- జానగింజదొర్క
జానగింజదీసుక- పల్లెకుపోతె
పల్లెనక్క అన్ని బోనాలు ...
అప్పడివాళ్లు- జల్లుమనె
జల్లుమనకాడ- మల్లాలరాలె
మల్లాలవాకిలి- తోట్లనుండె
తోట్లయున్నది గుబ్బలపడుకు
గుబ్బలపడుకుకు- గుత్తపురైక
[illegible]
ముగ్గగాదురో- పోడుగనీప
నీపగాదురో- నిమ్మలభాయి
భాయిగాదరో- ఒసంతమార
మారగాదురో- గుమ్మడిపండ
పండుగాదురా- పావరమాసం
మాసంగాదురా- మర్యాలపోడ
పోడిగాదురో- పోకిరిదొర
దొరగాదురో- దొరవకల్లు
కల్లుగాదురో- కనకపుమూట
జాజిరి జాజిరి- జాజిరిపాప
ఈరన్నా- బొల్లిగోడె
ఈరాగండం- పూసుకోని
జామాచెట్లకు- బండికట్టె
చిన్నాపాపని- లేటాకొట్టె
మందూదేరా- మామాకొడ్క
అన్నీపూర్ణా-దిద్దినగాని
ఆన్నాకొండా- నెరుగాలేదు
అన్నాకొండా- బొల్యావు
డొంకాదాకా- తర్మినాది
డొంకానున్నా- కోడికోళ్లు
కోటిదాకా- తర్మినాది-
కోట్లవున్న- పిల్లలకోడి
గుడిసెదాకా- తర్మినాది
గుడిసాలున్నా- మూసాలమ్మ
మాదామాముంతల కల్లోత్తాగి
[illegible]- కొట్టినాది॥ జాజిరి

—

# ఆయుర్వేదము-వైద్యము

## నిమ్మపండు

(పంజాలసత్యనారాయణ, హకీంగారు)

నిమ్మపండ్లను మనఆయుర్వేద వైద్యులు ఏవో కొన్ని-కొన్ని జబ్బులయందు వాడుచున్నారు వీనియొక్క పరిపూర్ణ ప్రయోజనమును పరిశీలించి నారింజతో పోల్చి నిమ్మపండుయొక్క పేరును తగ్గించినారు. "విటమిన్సు" అను మిషచే నారింజలకు విలువ హెచ్చించినారు. ఆంగ్లవైద్యులు మొదటినుండియు పండ్లలో కెల్ల నిమ్మపండును రాణిగా భావించుచుండెడువారు, నిమ్మకాయ గుణములను కొన్నింటిని నాఅనుభవము మీదను, శాస్త్రవేత్తల అభిప్రాయము మీదను వ్రాయుచున్నాను

నిమ్మకాయను-బాగుగాపండినపిదపనే ఉపయోగించవలయును అందులో చెనుకుగుణము కనిపించనేరవు. పండుతాజాదిఅయినచో, విటమిన్సుగూడా వుండును వీనిలో 'సి' విటమిను హెచ్చుగాగలదు ఇదిపిత్తమునువిరచేవిటమిను దీనిలో ప్రాక్ఏసిడ్సు ఫలజాతు లోనున్నదానికంటె "పొటాషియం" అను ఖనిజపదార్థం హెచ్చుగాగలదు దీనియందు లోహము, రాగిగలవు ఇదిపొట్టలోని ఆమమును విరచి వేయును కనుక పొట్టదాగునలవాటుకలవారు ప్రతినముఉదయ కాలమందు దీనినుపయోగించుటమంచిది శీతలవీర్యమగు అది శ్వాసజబ్బుచేయునని కొందరిఅభిప్రాయము కావునవేడినీటిలో కలిపిత్రాగుట మంచిది లేకున్న కఫముచేయగలదు ఇటలీ పంచదారకల్పరాదు జర్మనులు వేసవికాలములో నిమ్మరసము బార్లీనీరు పంచదారకలిపి త్రాగుదురు అదిఎండవేడిమిని పోనడచి హాయినిచ్చును

నిమ్మపండ్లరసములో పంచదారకుబదులుగా దుబికారకరాంచేము తేనెకలిసి వాడుకొనవచ్చును ఈరీతిగాప్రతిదినమువాడిన జీర్ణకోశమును శుద్ధిపరచును ప్రాతఃకాలమున భోజనాత్పూర్వమునకే పుచ్చుకొనుటశ్రేష్ఠము లేకున్న కొందరికి వ్యతిరేకము చేయును దీనినిపుచ్చుకొనుటకుభోజనమునకుముందు మూడుగంటల విరామముండవలెను దీనిపానీయముదగ్గుల సమోఘముగా కుదుర్చును, దాహమునుఆర్పును గుడముకలిపిత్రాగిన నిద్రపట్టునట్లుచేయును దీనినిప్రకృతివైద్యులు, సమస్తవ్యాధులయందువాడుదురు దీనిలోనున్న "ఆసిడ్సు" (అమ్లపదార్థము)వలన గొప్పఉపయోగముకలదు తాజానిమ్మపండ్లనుదగ్గరనుంచుకొనిన కలరాఅంటుజాలదు, కొంచెమాత్రికులు కలరావ్యాధులకు నిమ్మపండ్లను మొదలయందు కట్టెదరు, కొన్ని నిమ్మలను కోసివేయుదురు దీనినిప్రతిదినముపుచ్చుకొంటూవుంటే దీనియంతోఘగుణము తెలియగలదు ఇదియేఅతిసారమును కుదుర్చును నిమ్మపండ్లరసముతో గురిజపరిమాణము కుంకుమపువ్వుచూర్ణముకలిపిత్రాగిన రక్తవిరేచనము కట్టును నిమ్మరసమును ప్రతిదినమువాడిన సుఖరోగము నివృత్తించును పదివత్సరము లవయస్సుగలవాడు ఒకఫలరసమును, ఇరువది వత్సరములవయస్సుగలవాడు రెండుఫలములను, ఇదేప్రకారముగా పదివత్సరముల కొకఫలముచొప్పున హెచ్చింపుచూ, ఆయిదు లేకఆరుఫలముల రసమును ఉపయోగించవచ్చును ఇదిఎట్టి వ్యాధులను దరిచేరనివ్వదు ఆయుఃప్రమాణమును హెచ్చించగలదని ఆంగ్లేయశాస్త్రజ్ఞులచేపొగడబడినది ఏలననగా యీఫలరసముఎముకలను ఎముకలనంటిపుండుపదార్థమునుపోషించును ఇదియే ఆయుర్వృద్ధికి కారణము రక్తమునుశుద్ధిపరచును శరీరమందలి దుష్టపదార్థమును కరగించి మూత్రపిండములద్వారా బహిర్గతముచేయును దీనిలో ఆన్నింటికి మించినమంచిగుణ మింకొకటి గలదు ప్రతిదినము ౨-౩ పండ్లరసముపయోగించుచువచ్చిన అమూత్రవ్యాధిని తగ్గించును ఒకనిమ్మపండురసము ఒకఔన్సునీటిలోకలిపిత్రాగిన అజీర్తిని శమింపజేయును ఒకచెంబు నీటియందు ఒకనిమ్మరసము పిండిత్రాగిన దాహముతగ్గి ఆప్యాయతనిచ్చును దీనిలోకొద్దిగా 'బి' విటమినుగూడాగలదు దీనిరసమును కొబ్బరిపాలలోగలిపి తరచిరచో, నవనీతమగును అదితలకంటుకొనిన వెంటనే వేడితగ్గి, నేత్రములకు చలువచేయును పైనవనీతములో వెన్న గలిపిముఖమునకురాచిన మొటిమలు స్నో అగును దానిని శరీరమునకురాచిన చల్లదనమిచ్చును శరీరములోని మురికిని బహిర్గతపరచును, నిమ్మపండు పైపొట్టునుమార్దించి, సమభావముగా భావంచవిత్తులచూర్ణముకలిపి రాచిన తామర-తీట మొదలగుచర్మవ్యాధులను నశింపజేయును

నారింజ సరిపడనివారుగలరు గాని, నిమ్మ సరిపడనివారులేరు ఎందుకనగా, నారింజలో 'ఏ' విటమిను, పిండిపదార్థముండుటచే, ఉష్ణతత్వజ్ఞులకు మలబద్ధకము పోకడచును నిమ్మ అనుపాన భేదములచే సర్వతత్వములకు అనుకూలించును. కొంచెం గోరువెచ్చనినీటియందు కొద్దిగానిమ్మరసము చేర్చి పిల్లలకు ఎనిమాయిచ్చిన క్రిమిరోగములు హరించును

---

**జ్వరం, దగ్గు, మలేరియా, చలిజ్వరం, టైఫాయిడ్ జ్వరం**

ఈకేవలకాలం పిల్లలకు, పెద్దలకు తరుచుగావచ్చును ఇతరమందులన్నిటికంటెను యీమందుశాల్ల మంత్రించినట్లు 3 రోజులలో తగ్గిపోవును గ్యారంటీమందు 1 సీసా రు 1 వి పి 0-8-0

డాక్టర్ రత్నం అండ్ సన్సు మెడికల్ హాల్ 252 బి. మలక పేట, హైదరాబాదు-ద.

---

**అందరూ. ఈరోజునుండే పుచ్చుకొనుట ప్రారంభించండి.**

ట్రేడ్ మార్కు

**జాండు ద్రాక్షాసవ**

దేహమునకు మెదడునకు ఉత్సాహమును గలిగించు రుచ్యమైన ఔషధము

జాండు ఫార్మాస్యూటికల్సు లిమిటెడ్-బొంబాయి

నిజాం ఏజంట్లు

మెసర్సు, డి. జె. పారేఖ్ అండుకో—శికింద్రాబాదు.

---

## కోరిన సంతానము బడయు ఉపాయము

అమెరికాప్రొఫెసరు ఉపన్యాసము

అమెరికా సంయుక్త రాష్ట్రములో మించింగను విశ్వవిద్యాలయమున వైద్యశాస్త్రప్రవీణుడుగా వున్న డాక్టర్ జేమ్సు ఏ మిల్లరుగారు ఆహారభేదంవల్ల మగపిల్లలు ఆడపిల్లలుపుట్టుటమునుగూర్చి చెప్పినారు ఈమిల్లరుగారు యిప్పుడు ఇండియాలో సంచారముచేయుచు, ఢోల్పూరుకు వచ్చినారు

స్త్రీలు కడుపుతోయుండినపుడు వారుకోరినట్లు ఆడపిల్లగాని మగపిల్లవాడుగాని పుట్టవలెనంటె చూలుఏర్పడినది మొదలు ప్రసవించేవరకు డాక్టరు తగినఆహారమును యేర్పాటుచేయవలెను ఒకవిధమైనఆహారమువలన మగపిల్లవాడు మరొకవిధమైనఆహారమువలన ఆడపిల్ల ఇట్లుఆహారమార్పులవలన ఆడపిల్లలను, మగపిల్లలను జనింపజేయవచ్చును ఈవిధమగుపరిశోధనలు అమెరికా సంయుక్తరాష్ట్రములలో జరుగుచున్నవి

రుచికరమైన కారోబ్హైడ్రేట్సు హెచ్చుగావున్న పదార్థాలను ధనవంతులు తినుటవలన ఆడపిల్లలుపుట్టుచుందురు బీదవారికిట్టి పదార్థాలు లభ్యముకావు కాబట్టి మగపిల్లలుపుట్టుచుందురు కావున తల్లితింటుయుండిన ఆహారమునుబట్టి ఆమెకు మగబిడ్డపుట్టునో ఆడబిడ్డపుట్టునో సులభముగా చెప్పవచ్చును ఇందువలన వారుకోరిన బిడ్డపుట్టునట్లు చేయవచ్చును

---

## "ఆయుర్వేదకళ"

మాసపత్రిక  వెడలుచున్నది

సంపాదకులు-శ్రీమాన్ వేదాల తిరుమలవేంకట రామానుజస్వామి శతావధాని- ఆయుర్వేదాచార్య

ప్రభుత్వానుమతి చెందినది

శారీరక మానసిక, ఆరోగ్య బలములను గూర్చిచర్చించు ఆరోగ్యపత్రిక నైజాం రాష్ట్రమువగల డెబ్బదిలక్షల ఆంధ్రులపక్షమున యిదియొకటియే. సమగ్రశాస్త్ర చర్చలలో సమర్థులగు అనుభవముగల ఆయుర్వేద పండితులచే వ్యాసములు వ్రాయించబడును. శంకాసమాధానములకు, సందేహాస్పదములగు వ్యాధుల చికిత్సలు మున్నగు చర్చలకు, తావొసంగబడును పత్రిక రాయల్ పెద్దసైజున ౪౦ పుటలకు తక్కువలేకుండావుండును సంవత్సర చందా రు౧-౫-౦లు మాత్రమే చందాదారులు కాగలరు, వారు వెంటనే వివరములకు క్రిందిఅడ్రసుకువ్రాయవలయును టపాబిళ్లలు జవాబిచ్చుటకై పంపవలయును.

రామానుజస్వామి ౧౯ సు-హై

---

## పత్రికాభినందనము

ఉత్పలమాలిక

(వి రామసుబ్బారాయడు గారు)

ఆరనిదీక్షపెంపున సమంచితలీలగ "గోలకొండ" వాగ్గోరణిమీద బత్రికలక్ష్మి దలమానికమైతనర్చి యిం,పారగ గార్యసంగతుల నంతముగా బదునాల్గువర్షముల్ దీరిచె దెన్గుభాషగల దియ్యదనంబదియంచు జాటి విస్తారపరాక్రమంతమును సారముదీరముగల్గుచోటనే, దారినిదెల్గుభాష ప్రముదంబుగ వ్యాప్తము గానిచోటనె, వ్యారమనాయమీకి పెదదారులు పట్టినచోట హాస్యముల్, వారకచేసి కార్యమును వమ్మొనరింపగజేయుచోట__లో ధీరత చిక్కబట్టి కవిధీరుడునైన "ప్రతాపరెడ్డి" ప్రజ్ఞానముబంకు తీరమునువారె శుభంబగులగ్నమందు నాపైరహిమీర వైవక్రపమైగ గతులక్ష్మకముంచి శ్రద్ధగా భారమువెంతయైన నొకపట్టునదా విమకంచవేయగా, నేరకధీపటుత్వమును నేర్పును గూర్పుచు జాపి పత్రికా, భారమునిర్వహించుచు శుభప్రతిభప్రదనరారగా వలం, కారము లన్నియుక్ బునవికాయముమెచ్చెడి రీతిగూర్చు సు శ్రీరహిమీర రాజగుణ సింధుడు వెంకట రామరెడ్డి యుక్, మీరిన ప్రేమతత్వమున మేలగు పోషణముల్ బొనర్చి వే,శ్వర సహాయసంపదభివృద్ధిగ హెచ్చుగనీయగా జమీందారుల ప్రాపుగాంచె నిజతత్వము తేటపడంగ జేయగా, వేరిమితో చితామహుడు వేమకతో హనుమంతరావు సద్గౌరవ మెంతయో తెనుగుకల్గికి జూపె ప్రతాపరెడ్డికిక్, ధారుణి మాతృభాష విదితంబుగ పోషణ నేయ నెంతయో, వారిధీరినిక్ విబుధవర్గము నెల్లరకంబుజేసి సత్కారము__ల్ గాంచి ఈ విధంబును జాపె నిదాన పైకరిక్, గూర్చె చెప్పువారి కడకున్ జని సామ్ముల వన్నెయైన నే, బీరము లేకనేటి కభివృద్ధియయెన్ మన "గోలకొండ" యీ దారుల నెంగి సంతసము దద్దయు దోపగ మిత్రలేఖకా, ద్వారమునన్ మదాశయము బంపుచునుంటి విధేయశాఖల్. చేరిచి భక్తిభావముననేహాల తాకవితాను సంఘమీ.తిరున గోలకొండయొదం దియ్యము నెయ్యము జాటు లెక్కగా నూరకపల్కనేల? రజతోత్సవమైభవ మెల్లదియగా నేరుమనాడు "రెడ్డి" గణనీయుడు దేవుడు తెన్గుభూమికిన్ చేరగడించినాడనుచు చేయువిధంబుల నెల్లవారలున్, గీర్తిచేయుచుండ బరికింపగ వాదల వాదవాదలన్ వైరులుగూడ మెచ్చుకొను వైఖరిపత్రిక పేరుగాంచెడిన్, భూరితమైనభాగ్యములు బొందుసుఖించు జిరాయురున్నతిన్.

---




మూత్రము బొట్లు బొట్లుగా వచ్చుట, మూత్రము చేయునప్పుడు బాధ, మంట, చీము వచ్చుట మొదలగునవన్నియు, మహా భయంకరమగు గనేరియా లక్షణములు. యీ వ్యాధి ప్రత్యేక సంయోగమువల్లగాని, సంయోగము లేకనే గాని సంభవింపవచ్చును. సకాలమున దీనినరికట్టనిచో పాడుకొనిపోయి రోగి శరీరమును శిథిల పరచును లేదా దాని గుణములు వారిబిడ్డలపైన నైన చూపించును. అబ్బా! మహా భయంకరమైన పిత్రార్జితము-

# చిషాలూం

యిటువంటి అంటువ్యాధులను వెంటనే అరికట్టి బాధలనణచి కాలక్రమేణ వ్యాధిమూల మంట పోగొట్టును. చాల మొండివ్యాధులను గూడ కుదుర్చును.

వెల. బుడ్డి ర్పు, 4/- వి-పి. చార్జీలు ప్రత్యేకము.

| | |
|---|---|
| జే. బాలాభాయ్ అండ్ కో., 260, చైనాబజార్ రోడ్, మదరాసు | ప్రాన్‌లాల్ అండ్‌సన్సు, 51, ఆర్కాటు శ్రీనివాసాచార్ స్ట్రీటు- బెంగుళూరు సిటీ. |

హైదరాబాదు & సికింద్రాబాదు. డి. జె. పారేఖ్ అండ్ కో.,

# చైనీస్ మెడికల్ స్టోర్ (స్థాపితము 1930)

## హెడ్ ఆఫీసు:-28, అపోలోస్ట్రీట్, ఫోర్టు, బొంబాయి,

బ్రాంచీలు.— అహమ్మదాబాదు, ఢిల్లీ, & కలకత్తా.

---

## ది సెంట్రల్ బ్యాంకు ఆఫ్ యిండియా లిమిటెడ్

స్థాపితము—డిశంబరు 1911.

| | |
|---|---|
| అధికార మూలధనము ర్పు 3, 50, 00, 000 | చందాల మూలధనము ర్పు. 3, 36, 26, 40 |
| చెల్లించిన మూలధనము ర్పు 1, 68, 13, 200 | రిజర్వు, మరియు |
| 31 12 వరకు నిలువ ర్పు. 31, 03, 09, 000 | యితర నిధులు ర్పు. 101, 47, 000 |

హెడ్డాఫీసు -ఎస్ప్లనేడ్ రోడ్, ఫోర్టు బొంబాయి

నిజాంరాష్ట్రములో బ్రాంచీలు —హైదరాబాదు, శికింద్రాబాదు, ఔరంగాబాదు, జాల్నా, సైలు, రాయచూరు, లాతూరు, వరంగల్

103, బ్రాంచీలు, పే ఆఫీసులు యిండియాఅంతట యున్నవి

డైరక్టర్లు -సర్ హెచ్ పి మోదీ కె బి యి అధ్యక్షుడు.

ది రైట్ ఆనరబుల్ నవాబు సర్ అక్బర్ హైదరీ, కెటి పి సి

| | |
|---|---|
| అర్దిషిర్ బి దుబాష్‌గారు | హరిదాస్ మాధవదాసుగారు |
| డిన్షా డి. రోమర్ గారు | విఠల్ దాసు కంజీగారు |

సర్ దోన్‌భాయి హెచ్ భివండివాలా కె టి

నూర్ మహమ్మదు యం చినాయ్‌గారు

బాపుజీ డి లాంగారు

ధరంసేయ్ రాజ్ ఖాట్వాగారు

లండన్ ఏజంట్లు - బార్క్లేస్ బ్యాంకు లిమిటెడ్ మరియు మిడ్‌ల్యాండ్ బ్యాంకులిమిటెడ్

న్యూయార్కు- మరియు పారిస్ ఏజంట్లు - ది గ్యారంటీ ట్రస్టుకం. ఆఫ్ న్యూయార్కు-

హెచ్. సి. క్యాప్టెన్ మేనేజరు.

---

